# నా ఉదయం

## (కవితా సంకలనం)

నాగభైరవ కోటేశ్వరరావు

"కాటూరిగడ్డ" అభిమాన ప్రచురణ

పెదపాడు - 534 437. A.P

డిశంబరు 1983.
ప్రతులు: 1000

శ్రీ "కాట్రగడ్డ" అభిమాన ప్రచురణ
నెం : 3

ముఖపత్ర రచన
'అల్లూ'

వెల: ఆరు రూపాయలు

ముద్రణ: లిబర్టి ప్రింటర్స్ – చీరాల.

ప్రతులకు: నాగభైరవ కోటేశ్వరరావు
ప్రభుత్వ స్త్రీల కళాశాల
చీరాల 523 155.

# విషయ సూచిక

# కృతజ్ఞతలు



## "కవితలకు జీవగడ్డ శ్రీ కాట్రగడ్డ"

కాట్రగడ్డవారు కమనీయ హృదయుండు
కవిత లల్లి ఘనత గన్న వాడు
నాదు కవిత మెచ్చి, నా పుస్తకము గొని
అచ్చువేసినాడు యిచ్చినాడు —

అతని స్నేహ సుగంధ సంతతుల మురియు
టెన్ని జన్మల బంధమో యెరుగ రాదు —
వారి కవనమ్ముపట్ల నవ్యాజ ప్రేమ
వారికిని నా కవిత్వమ్ముపట్ల నంతె

ఏమి యిచ్చెద ? నీ ఋణ మెట్లు దీర్తు ?
నమున దొక్కటె నా కెదురైన పరీక్ష —
పూవువైనావు పరిమళములను విరిసి
మబ్బువైనావు వానగా మమత గురిసి

ఆశీస్సుమనస్సులతో,

**- నాగభైరవ.**

# అంకితం

## శ్రీ. కె.పి. పెంచలయ్యగారు. A.P.A.S,

పెంచలయ్యకు నేను కావ్య వి
పంచి ప్రోగించితిని ఎందుకు ?
అంచె లంచెలుగాగ ఆతని
మంచితనము గ్రహించి నందుకు—

అతడు నెల్లూర్ మండలానికి
సుతుడుగా - ఆంధ్రావనికి స
మ్మతుడుగా - కవితా వధూటికి
హితుడుగా - నేగాంచినందుకు —

మంచి తనమది రూపుదాల్చిన
మనీషిగ నే నతని నెంతును
చక్కనౌ సంస్కారముల విర
జాజిగా నే గౌరవింతును —

పదవి కొందరి కగును అందము
పదివికే మరి కొంద రందము
పదవు లెన్నిటి కెక్కినా, ఆ
ఎద సుగంధము, మది మరందము

నెల వెలుంగుకు చుట్టు వెలుగుల
వలయ మేర్పడు నటుల, ఆతడు
నడచు ప్రాంతముచుట్టు చైత
న్యముల పంటలు పండు చుండును—

ఎందరుందురు కవనమును మది
విందుగా భావించు వారలు ?
ఎందరుందురు కవుల నాప్తుల
చందమున గుర్తించు వారలు ?

నాదు కవితా లతాంగికి ఆ
నంద మాతని ప్రేమదృక్కులు
నాదు కవితా లతాంతములకు
నందనములగు వాని వాక్కులు —

ఉన్నతోన్నత భావములతో
ఉజ్జ్వలంబగు నవ ప్రతీకము
అగరువత్తుల పొగల గుత్తుల
యట్లు ఆతని ఎద పతాకము—

ఉదయగిరి జన్మించుతానము
హృదయమే సిరి కాలవాలము
అందుకే 'నా ఉదయ' కావ్యము
అంకితమ్మొనగుటయె భావ్యము

- నాగభైరవ.

# "నా ఉదయం"

## కృతిభర్త



శ్రీ కె. పి. పెంచలయ్యగారు

'పెంచలయ్యకు కృతి యొసంగుట
మంచి తనముకు మతి యొసంగుట
మంచి గంధము, మల్లెపూవులు
మమతతో యొక చోట జేర్చుట'

# నా అభీష్టం

కావలి కాచే కనురెప్పలు నాకిష్టం
కావలసిన వారంటే మరీ యిష్టం
స్పష్టంగా సాక్ష్యమౌ సాధ్యులౌ
స్నేహితులంటే చెప్పరానంతయిష్టం
కోరక నన్నెరుగక నన్నభిమానించిన
నాగభైరవాగ్రజుడంటే ఎంతోయిష్టం !

నేలనుబికే నీరంటే నా కిష్టం
మనసుబికిన కవింతటే నాకిష్టం
దర్పంగా ధృఢంగా దిక్కులెల్ల
శరదీపికలౌ కావ్యాలు నాకిష్టం
'నా ఉదయ' మంటూ నడుస్తున్న
నాగభైరవ నాదామృత మన్నా యిష్టం !

నడిచే కాలమంటే యిష్టం
నను విడువని నేస్తమంటే యిష్టం
పెన్నిధి కోరని వాడంటే యిష్టం
సన్నిధి చేరే వాడంటే యిష్టం
నాగభైరవ నీడంటే యిష్టం
నాగభైరవ తోడే నా అభీష్టం

పెదపాడు,
తే. 1-1-84

- శ్రీ "కాట్రగడ్డ"

# 1. నా ఉదయం

నా ఉదయం
పదాల్లోంచి కాదు
పెదాల్లోంచి కాదు
హృదయాల్లోంచి పుడుతుంది
జీవనదీ నదాల్లోంచి - వాటి
నాదాల్లోంచి పుడుతుంది—

నా ఉదయం
తూర్పులోంచి కాదు
ఊర్పులోంచి - మనసు
మార్పులోంచి - మనిషి
తీర్పులోంచి పుడుతుంది—

ప్రావృట్కాల పయోధర
గర్జా ప్రకోపాలు
జీవత్కావ్య శార్దూల మత్తేభ
పదోన్మత్త నృత్త ప్రలాపాలు
ఎగరేసిన అమానుష శ్రీయోషా

కుచోపరి చలత్ చలిత చేలంచలాలు
నా ఉదయానికి
అవరోధాలూ—
అపరాధాలూ—

అనంత పీడిత తాడిత జన
బాధా జనితోజ్జ్వ లోచ్ఛ్వాస నిశ్వాసాలు
వసంత రాగరంజిత
మానవతా గాధా గత
చకచ్చకిత నవ్య విశ్వాసాలు

నా ఉదయానికి ద్వారాలు
ప్రభా ప్రభాత తీరాలు
మణి హారాలు.

నా ఉదయం అస్తవ్యస్తం కాదు
నా ఉదయానికి అస్తమయం లేదు
అది నిత్య నూతనం
అది సత్య భాసితం
శాశ్వతం

(ఆంధ్రప్రభ వారపత్రిక)

# 2. ఈ ఊరికి దారి యిదే !

నన్నయ్యా ! తెలుగు కవిత
కన్నయ్యా ! "ఎన్నయ్యా !"
ఇన్నాళ్ళకు యిన్నేళ్ళకు
అన్నా ! నీ ఉత్సవాల
పున్నమి వెన్నెల్లోపల
సంతోషం సంరంభం
సంద్రంలా పొంగుతుంటె
ఆంధ్రావని అణువణువున
ఆర్భాటం సాగుతుంటె
ఆనందస్రా వీవని
అనుకున్నాం గాని స్వామి

కన్నీళ్ళతొ వెళతావేం ?
కలత మోము పెడతావేం ?

ఇన్నాళ్ళకు యిన్నేళ్ళకు
ఈ ఉత్సవ హేల జూచి
సూరీడిని కొవ్వొత్తితొ
చూపించే తంతు జూచి
పూవుకు వాసన వుందని
బోధించే స్టంటు జూచి
నీ పేరున మా ప్రతిభకు
నిచ్చెన వేయుటలు జూచి

కన్నీటితొ వెళతావేం?
కలత మోము పెడతావేం?

గాసట బీసటలు చదివి
గాధలు త్రవ్వే జాతికి
భారత కధ మొదలు పెట్టి
ప్రాభవాన్ని గూర్చావని
వెయ్యేళ్ళుగ నీ కవితలొ
వెలుగు లెంచి జిలుగు లెంచి
నానారుచిరార్ధ సూక్తి
నందన వన పరిమళాలు
అక్షర రమ్యతలో గల
అక్షయమగు శ్రీదళాలు

నీ ప్రసన్న కథా కలిత
నూపుర ఝంకారాలు
కంటూ వింటూ ధీసిసు
అంటూ గ్రంధాలు రాసి
చెప్పిందే చెప్పుకుంటు
విప్పిందే విప్పుకుంటు
నీ భారత జలనిధిలో
నిలువు ఈత లీదుకుంటు
ముక్కుమూసి అడుగునుండి
నిక్కపు రతనాలు దెచ్చి
వాగ్దేవికి తనయుడంచు
వాగనుశాసనుడ వంచు
ఎంతెంతో చేశామే !
ఏమేమో రాశామే !

కన్నీటితో వెళతావేం ?
కలత మోము పెడతావేం ?

హైస్కూల్లో, కాలేజీ
ఆంధ్ర గ్రంధ మాలలందు
విశ్వకళా పరిషత్తుల
ఎకాడమీ సభల్లోన

సాహిత్యపు చిందుల్లో
మా హితవుల విందుల్లో
మన్ను తవ్వి నీ చరిత్ర
మిన్ను వేపు విసిరామే !

ఆనందం ఉపదేశం
అవి కవితా ధర్మాలని
ఆనాడూ ఈనాడూ
ఏనాడూ అరిచామే

కన్నీటితో వెళతావేం ?
కలత మోము పెడతావేం ?

భారతాన నువ్ చేసిన
భాషా ఛందో యతులను
మన్నించుట మానామని
మనసు నొచ్చుకున్నావా ?
వ్యాకరణపు రాహిత్యం
వ్యవహార పురోహిత్యం
రాజ్యమేలు తున్నాయని
చోద్యం కని కుమిలేవా ?

నిన్న భారతాలు పదియు
నెన్మది పర్వాలయితే

నేటి భారతాలు పదియు
నెన్మది పంక్తులు మాత్రమె
కాదు కాదు పదునెన్మిది
క్రమపు వర్ణాలె సుమా
అంచు మేము ఎలుగెత్తా
మంచు ఏడ్చు చున్నావా ?

నీ వెంబడి ప్రబంధాలు
భావ మధుర గంథాలు
ఆ వెంబడి అభ్యుదయం
దాని వెన్క దిగంబరం
ఈనాడో వైప్లవ్యం
ఇన్ని గతుల కవిత మారి
సామ్రాట్టుల వదలి పెట్టి
ప్రేమాయణ మవలనెట్టి
సగటు మనిషి కోసరమై
సాహిత్యపు బట్టలు వి
ప్పామని నువ్ కుమిలేవా ?

రంకు ముండలై బజారు
డొంకలెక్కు మహాకవుల
వంకర బుద్ధుల బూతుల

సంకరమై సాహిత్యము
శంకరగిరి మాన్యాలకు
చేరెనంచు వగచేవా ?

కన్నీటితో వెళతావేం ?
కలత మోము పెడతావేం ?

అందులకై కుందేంతటి
మందుడవని భావింపను;
సాహిత్యం నిత్య హరిత—
సాహిత్యం సాదు చరిత.—

పరివర్తన దానికి విధి;
పరిణామం దానికి గతి;
మారుతున్న బ్రతుకు విలువ
బాటల్లో సాహిత్యం
మారకున్న అది శవమే
మారినచో అది శివమే !

స్రోతస్విని వోలె సాగి
వోయుగాలు మార్చనిదే
జనం కొరకు కదలనిదే
జనమును కదలించనిదే
కవిత పేరు కవితకాదు
నవతకు దర్పణము కాదు.

ఈ సత్యం తెలియక నీ
వేడ్చు చుంటివని ఎంచను
క్రాంతదర్శి వీవు – నీవు
కానని సత్యమ్ము లేదు.
ధీమంతుడ వీవు – నీకు
తెలియని ధర్మమ్ము లేదు
మరి ఎందుకు ఈ రోదన ?
మౌనంగా ఈ వేదన ?

పోతనకై నిరుడు మేము
జాతరలను జరిపామే !
తిక్కనకై తిరునాళ్ళను
తిరిపెమెత్తి నెరిపామే !
ఎర్రన పేరున పీఠం
ఎత్తుగ నిర్మించామే !
నీకు గూడ నిన్న నేడు
నీరాజన మిచ్చామే !

మరి ఎందుకు ఈ రోదన ?
మౌనంగా ఆవేదన ?

ఆకవికై ఒక పీఠం
ఈ కవికై ఒక పీఠం

పీరమ్ముల పేరులతో
పేరులకై ఆరాటం
స్వామీ ! ఈ మధ్యంలో
సాహిత్యం జలిపిరం

వాళ్ళ వాళ్ళ వాళ్ళ వాళ్ళ
వాళ్ళ వాళ్ళ కాహ్వానం
వాళ్ళ వాళ్ళ వాళ్ళ వాళ్ళ
వాళ్ళ వాళ్ళ సన్మానం
ధనమూ కీర్తీ అహమూ
సాహిత్యపు వ్యామోహం
ఘనమూ స్ఫూర్తీ దాహం
సాహిత్యపు వ్యాపారం

పత్రికలో కవితపడిన
ప్రతివాడూ మహాకవే !
కులం గుంపు చుట్టూచేర
ప్రతివాడూ వాచస్పతి

అండలేక సాహిత్యం
అందలాల కెక్కలేదు
కండ గలిగి అండలేని
కైత సౌరు కెక్కబోదు.

ఆర్తి ఆర్తి ఆర్తీ అని
అరచి కవితలను రాసే
కవుల తలలు పగుల గొట్టి
కాంచే దేమిటి చెప్మా !
కీర్తి కీర్తి కీర్తీ అని
కీర్తనముల బాడి తప్ప !!

సాహిత్యపు దుర్వ్యవస్థ
మా గుండెలలో అవస్థ
చూడలేక విలపిస్తూ
నీడలేక ఏడుస్తూ
కళ్ళ నీళ్ళ తోడ నీవు
వెళుతున్నా వటోయ్ కవీ !
వెళ్లు వెళ్లు మాకేమిటి ?
నీ పేరున పీఠాలను
నిర్మిస్తాం సాగిస్తాం

స్మృతినీయది, భృతిమాయది
కాలపు గతి కలవంటిది
ఏడ్పు నీది ఊడ్పుమాది
ఏ ఊరికి దారిఏది ?
మీ ఊరికి ఇదే దారి
అక్కడుంది గోదావరి —

(విశాలాంధ్రి)

# 3. ఏమని రాసేను ?

కొత్త కోరికలు గంపల
కెత్తుక వచ్చిన దానా !
నెత్తావుల పరిమళాలు
హత్తుక తెచ్చిన చానా !

ఓ ఉగాది సుందరి ! న
వోత్సాహపు పూవందిరి

ఏమని రాసేను నేను
ఈ కవితా గోష్ఠి యందు
ఏమని చేసేను నీకు
అబద్ధాల కైత విందు

గతవత్సర కాలం నా
కవితకు శిశిర మ్మాయెను
చెరబండా, పురివండా
పిలకా గణపతి శాస్త్రి
గుమ్మపాల కథల మేస్త్రి
బంగోరే, కుందర్తి

మత మారణ హోమానికి
మరణించిన మా యాపెన్,
మనసు కాదు హృదయాలను
మంత్రించిన మాదిరెడ్డి,

ఎందరు నా కులం వారు
ఎందరు నా కలం వారు
ఇల్లు వీడి పోయారో
ఎల్ల దాటి పోయారో

ఏమని చెప్పేను నీకు
నిన్నటి నా మంచు కథలు
ఏమని విప్పేను నేను
గుండెలలో ముల్లు వ్యథలు

గత వత్సర హేమంతపు
ఋతు శైత్యపు గాలుల్లో
ఏభై ఐదేళ్ళ నిండి
ఏ ఆకులు రాలాయో

ఎన్ని పదిరి కుప్పాల్లో
ఏ నూకలు చెల్లాయో
ఎన్ని పులుల ఆకళ్ళకు
ఏ మేకలు నీల్గాయో

ఏమని చెప్పేను నీకు
నిన్నటి నా మంచు కథలు
ఏమని విప్పేను నేను
గుండెలలో ముళ్లు వ్యధలు

నా వీధిని సౌగంధవ
నాలు పిరియు బూయాలని,
ముంగింట్లో ఆశయాల
ముగ్గులెన్నో వేయాలని,
లోగిట్లో మరుమల్లెల
తీగలు కొనసాగాలని,

వాకిట్లో వాసంతం
నాయింట్లో సంతోషం
వీరణాలు మోగాలని
తోరణాలు ఊగాలని

ఇంటి కప్పు మార్చేశా
కంటి చూపు మరలించా
గడప గడప ఎడద ఎడద
పన్నీటిని చిలికించా

ఇంట్లో చిందర వందర
ఇంకా సరిదిద్ద లేదు

ఎలుకలు అవతలి చేసిన
కలుగు లింక పూడ్చలేదు
గోడలపై అపనీతుల
రాత లింక తుడవ లేదు

వెచ్చని వాగ్దానము నెర
వేర్చనిదే శుభంరాదు
నిద్దుర మేల్కాంచనిదే
పొద్దు పొడుపు జాడరాదు

అందుకే ఈ యాగం
అందుకనే మా త్యాగం
అందుకనే అందుకనే
మా గుండెల నవరాగం !

ఇపుడు కాదు నాకుగాది
ఇపుడు రాదు నాకుగాది

నా దేశంలో మనుషులు
రెండే రెండు విధమ్ములు
చెమట ఓడ్చి బతుకు వారు
చెమట ఊడ్చి గతుకు వారు

వారి వీరి మధ్యన సో
దర భావము నా కుగాది

కుల మత భేదాల నీలి
కుడ్యాలవి కూలి పోయి,
సమ ధర్మం, సహ భావం
జగతి నిండి నపుడుగాది

ఆకలి శోకము చీకటి
అంతరించి సుఖ శాంతులు
వెలుతురులా, వెల్లువలా
ప్రవహించిన అది ఉగాది

నడిరాతిరి నడి వీధిని
పడతి నడచి భద్రంగా
తిరిగి వచ్చి నపుడుగాది
పరువు పోని యపుడుగాది

నిరుద్యోగ దురోదరం
నిస్పృహ వాతావరణం
దేశమాత      మును కలు
షితము చేయ నపుడుగాది

నీ గుండెన నా గుండెన
శాంతి నిలిచి నపుడుగాది

మనసు మనసు ఐక్యంగా
మసల గలిగి నపుడుగాది
ఈ నాటికి తిరిగి పొమ్ము
పై యేటికి మరలి రమ్ము

కిటికీలను తెరుస్తాను
కిరణాలను పిలుస్తాను
వెన్నెలనే కలయింపిగ
వీధుల్లో చల్లుతాను

ఎడద అందు చైతన్యపు
ఏతాముల నెత్తుతాను
గడపలలో పచ్చి పసుపు
కాంతులు పండించుతాను

మరు ఏటికి నీ వొస్తే
మా మనసులు కుసుమిస్తే
శ్రీ గంధం చిందిస్తాం
ఆహ్వానం అందిస్తాం

ఆమనితో రాయిస్తాం
నీ కోసం ప్రేమ గీతి
వెన్నెలతో వెలిగిస్తాం
నీ కోసం ప్రణయ జ్యోతి

**(ఆకాశవాణి ఉగాది కవిసమ్మేళనం)**

# 4. గమ్యం !

వాగ్దానపు వర్షంలో
వాసంతం హసి యించదు
సవ్వాళుల యుద్ధంలో
శాంతి పథం వికసించదు

రైతు కూలి ప్రజా రాజ్య
రమ్య వీక్షణం కోసం
రంకె లేసి నంత లోన
రాబోవదు సుఖరాజ్యం

కావలసిన దాత్మ దీక్ష
రావలసినదో దిదృక్ష
మాటలతో బూటకాల
ఆటలతో పోదు కక్ష

ఈ దేశం నాదీ యని
దేశ ప్రగతి కావాలని
పొరపొచ్చా లొదిలినచో
పొసగు ముందునడక మనకు

ఈ పార్టీ నాదీయని
ఇతరము నశియించాలని
భీష్మిస్తే మిగిలేదది
భీకర శోకమ్మే తుదకు

"చాలు చాలు నావాళ్ళకు
సాహాయ్యం జేయుటొకటే
నా లక్ష్యం"— అని అంటే
నందన వని వల్లకాదు—

మంది కొరకు శ్రమియిస్తే
అందలాలతో పనేమి ?
ఏకంగా కృషి చేస్తే
ఎక్కడ ఉంటుంది లేమి ?

మాట కాదు ప్రతి మనిషి
మారుటయే మన గమ్యం
ధనం కానెకాదు మంచి
తన మొకటే మన లక్ష్యం

దేశమాత మోము మీది
దైన్యపు రేఖలు తుడిచే
యువ హస్తాబ్జాల గంధ
మవతరించ వలె నిపుడు

సమ సమాజ నైతికత్వ
సంపద పెంపొందినచో
చేరువగును మన గమ్యం
చేకూరును మనకు జయం.

(విజయంభేరి)

# 5. ఆలోచించి చూడు -

ఈ దేశం నీకిచ్చిన సందేశం ఏమిటి ?
దేశానికి నువ్ చేసిన సహాయ్యం ఏమిటి ?

బుద్ధుడొకడు పుట్టి నీకు
బోధ చేసెనే అహింస
ఆధ్యాత్మిక దృష్టి నీకు
అలవరచెను పరమహంస

అక్బరు పరమత సహనపు
ఆధిక్యం గూర్చి చెప్పె
కాళిదాసు కావ్య సుధా
గాన స్రవంతులను విప్పె

ఈ దేశం నీ కిచ్చిన సందేశం ఏమిటి ?
దేశానికి నువ్ చేసిన సహాయ్యం ఏమిటి ?

ఆదిశంకరుల భాష్యం
అవధరించి నావు గదా !
అరవిందుని సత్యఘోష
ఆలకించి నావు గదా !

గాంధీజీ శాంతి పథపు
కాంతులు రుచి జూచినావు
నిన్న నెహ్రూ పేదల క
న్నీరు తుడువ గాంచినావు

ఈ దేశం నీకిచ్చిన సందేశం ఏమిటి ?
దేశానికి నువ్ చేసిన సహాయ్యం ఏమిటి ?

బుద్ధుని దేశమ్మున – దు
ర్బుద్ధులు ప్రవహింప జేసి,
పరమహంస సమాధిపై
పంకిలమును చిలకరించి,

మత మౌఢ్యపు రాకాసికి
మారణ హోమాలు జరిపి
కవితా సతి నుదుటి పైన
కస్తూరిని తుడిచి వైచి

ఇదా నువ్వు దేశానికి యిచ్చిన సంకేతము
ఇదా నువ్వు మానవతకు పాడిన సంగీతము

ఆదిశంకరా చార్యుడు
అరవిందుడు గాంధీజీ
అడవి గాచు వెన్నెలలై
పుడమి పైన కానరారు

ఒక్కనాడు నీతికి, సొం
పెక్కించెను నీదేశం
స్పర్ధలతో స్వార్థాలతొ
వ్యర్థ మాయె సందేశం

ఇదా నువ్వు దేశానికి యిచ్చిన సంకేతము
ఇదా నువ్వు మానవతకు పాడిన సంగీతము

ఇపుడైనా మించలేదు
విపులమైన గుండె మనది
ద్వేషాలను తుంచి చూడు
దేశం- ప్రేమించి చూడు—

(విజయంభేరి)

# 6. ఎదురుచూపు

పరిజలు పతనపు అంచుపై నిల
బడిన యప్పుడు, పడెడి యప్పుడు
కవితతో కేలూత నొసగుచు
కాచు వాడే యగు- మహాకవి

ముసిరి ముట్టడి సల్పు మేఘపు
మూకలను చెండాడి, వెలుపల
జేరుకొని తన తేజములు భువి
చిల్కరించెడు వాడె యగు రవి

ఘనం సంగతి, ధనం సంగతి
ఖరా ఖండిగ మరచి, దేశపు
జనం ప్రగతికి, వారి సుగతికి
సాగు నాతడు నాయకుండగు

ఎవడురా విద్యార్థి ? పార్టీ
కవసరమ్మయి రెచ్చగొట్టిన
యపుడు ముందుకు దుమికి సమ్మెల
నడుపువాడా ? కానె కాడు.

జ్ఞాన సంపద పొందుటే తన
ధర్మ మని గుర్తెరిగి – లోకపు
రీతులను గమనించు నాతడు
చేత నడు– విద్యార్థి యనబడు

రైతు శ్రేయం, కూలి శ్రేయం
బుద్ధి జీవుల కొరకు న్యాయం
సతము దలచే సమ్మతుండే
జాతి కోరెడి దేశభక్తుడు

అట్టి నాయక రత్నములకై
ఆలిచిప్పల వగిది జనములు
ఎదురు తెన్నులు జూచు చుండిరి
ఉదయ మెప్పుడు జరుగునోయని

(విజయభేరి)

# 7. నా కల.

నిస్సహాయుల నిరుద్యోగుల
నిరాశా హేమంత జీవుల
కాశ గూర్చే, పేద దీర్చే
ఆమనీ ధామమ్ము – నా కల

అవనియే ఒక ఆమ్రశాఖయి
అందు మమతే పల్లవమ్మయి
ఆరగించెడి కోయిలే – హృద
యమ్ము కావలె నంది – నా కల

నితాంతాతప భీతులవుతూ
నిస్పృహాగ్నుల కాలిపోతూ
భీతి చెందెడి తమ్ములకు సం
ప్రీతి కూర్చెడి చినుకు – నా కల

అకలన్నది శోకమన్నది
చీకటన్నది చింతయన్నది
లోకమున ఛేదించి వేసెడి
బాకుగా సాగేను – నా కల

పేద భావం వాడిపోతే
భేద భావం వీడిపోతే
వేద మంతా అయించాలని
సాధు వాదం జయించాలని

తెచ్చుకొన్న ఉషస్సు కాలం
విచ్చుకొన్న వసంత గానం
అవని అంతా గాలి లాగా
ఆరబోసెడి తలపు - నా కల

త్రుంచినా కుసుమించు కొమ్మయి
వంచినా ఎదిరించు మానయి
కట్ట కడపటి విజయమును - చే
పట్టి పట్టము కట్టు - నా కల

(లాయర్)

# 8. విస్మృతి కథలు.

మహా ప్రస్థానమ్ము రాసిన
మనిషి ఎక్కడ ? మనసు ఎక్కడ ?
ఏవీ తల్లీ శ్రీనివాసుని
జీవ నాదాలు ?

"ఖడ్గసృష్టి" ని సలిపి పోరిన
కరము ఎక్కడ ? కలము ఎక్కడ ?
మాడరన్ మా తెలుగు కవితకు
డాడి ఏడమ్మా ?

పౌరహక్కుల సభల్లోపల
సౌరదీపం వోలె వెలిగిన
ప్రభాకలితం సఖాజ్వలితం
పలుకు లేవమ్మా ?

అరశతాబ్దం ప్రతీశబ్దం
అడుగు జనములకే నిబద్ధం
అంచు అరచిన ఈ శతాబ్ది వి
పంచి తెగినదా ?

ఇల్లు దాటని తెలుగు బాసకు
ఇలాతల తత్త్వము నేర్పిన
ఉన్నతౌన్నత భావ మెక్కడ
ఉంది చూపించు ?

తన ప్రభావం తన అనంతర
అనుజ తతిపై మనుజ తతిపై
ఉప్పెనై ముంచెత్తి తేల్చిన
ఒక్క డత డేడీ ?

పూల వనిలో పొంచి యుండిన
కాల సర్పం కాటు వేస్తే
మార్పుకొరకై ఊర్పు విడిచి
మాయమై నాడా ?

(స్రవంతి)

# 9. పురిటి కబురు.

వెలిబూదిగ వేదాంతం
వియత్పథం కురుస్తోంది !
తల మాసిన బోడి ధాత్రి
నిలువెల్లా తడుస్తోంది !

వెలుతురు రూపాయి బిళ్ళ
విశ్వమంత ఏలుతోంది—
చీకటినే చీఁదిసి
చేటలతో చెరగుతుంది

నింగికేమొ ఒళ్లు సలుపు;
నేలమేను రాచకురుపు;
కథలన్నీ విప్పి చెప్పి
సంద్రానికి గుండెనొప్పి—

డాకటేరు అంచగొండి
ఆకసాని కమ్ముడోయె
తూర్పు దిక్కు మంత్రసాని
తొంద్ర పాటు నవ్వులాయె

గాలి పురబీవార్త కొరకు
గది చుట్టూ తిరుగుచుండె
"ఆలస్యం కాన్పు - అంతే !
అలసత్వం కానె కాదు".

(ఆంధ్రజ్యోతి దినపత్రిక)

# 10. మళ్ళీ తెల్లవారుతుంది.

నడిచేది
నలుగురి లోనే
నలుగురి లానే
నడివీధి లోనే—

ఆలోచనల కాళ్లు
ఆకాశంలో —
కళ్ళు అంతరిక్షంలో—

ఈ చుక్కలు
చేతికి చిక్కినట్టే నటించి
వేళ్ళ సందుల్లోంచి
జారి పోతుంటాయి —

ఈ పిట్ట
రెక్కలూపుతూ సాగుతూ
కనుచూపు మేరలో
బిందువై
నిలువునా గుడ్డి వాణ్ణి చేస్తుంది

ఈ కథ రోజూ జరిగేదే !

అయినా
మళ్ళీ తెల్లవారుతుంది

కాళ్ళు ఆకాశంలో.........
కళ్ళు అంతరిక్షంలో........

(భారతి)

# 11. వర్తమానం.

స్వరం ఖంగు మన్నది — నర
నరం పొంగుతున్నది —
జన్మభూమి ఒడలంతా
జ్వరం కాగః తున్నది—

ముప్పది యారేళ్ళ మోష
తప్పులు చేస్తున్నది
అభిసారిక ఖండితమై
వ్యభిచారిగ నున్నది—

పటం మార్చుకొన్నది
హరం నేర్చుకొన్నది
మంచి తనం సన్న్యాసుల
మఠం జేరుకొన్నది—

స్వాతంత్ర్యం ఉన్నది
సమానత్వ మున్నది
మనుషుల్లోకాదు - నేత
మాటల్లో ఉన్నది

తారలలో స్వాతంత్ర్య - సి
తార మోగుతున్నది
దారుల మానవతకు - కై
జారు గుచ్చుకొన్నది—

(సజన)

# 12. నిదురపొండి !

నిద్దుర వాకిట నిలచిన
ముద్దుల పాపల్లారా !
పొద్దు పొడుపు వచ్చువరకు
నిదుర పొండి ! లేవకండి !

ఇలా తలం ఎల్లెడలా
ఈ లోగా ఎదబెడతాం
కలల వి త్తనాలు - మంచి
ఖరీదైన వి త్తనాలు.

కారే మా కన్నీరే
కలల పంట లెదిగించును
మా ఆశలు ఆశయాలు
మీ ముందర వెలిగించును

ఎద బెట్టిన కలలన్నీ
పదిలంగా పండగలవు
రేపు మీది 'రేపుమీది
చూపు మాది' - కాపుమీది

కొడవళ్ళతొ నిద్రలేచి
కోసి కొండి కలల పంట
గాదెలలో పోసికోండి
కాంతి ధాన్య మింట యింట

(మూలం:- సరోజనీ నాయుడు)

(లాయర్)

# 13. నా మబ్బులు

నా మబ్బులు
ఆకాశంలో కాదు
అవని మీదే తిరుగుతున్నాయి –
నీటిని ధరించికాదు – క
న్నీటిని ధరించి బ్రతుకు తున్నాయి –

మలయ మారుత మంద స్పర్శ
వీటి కెక్కడిది ?
కఠోర కరాళ హృదుల దుర్వీక్షణా
హతాలు నా మేఘాలు—

నిరాశా జల పరీవాహాఖాతాల్లో
చిక్కుకొని
ఆశా మరంద మాధురీ లహరుల్ని
రేపటి కోసం గుండెల్లో పెట్టుకొని
నిస్పృహా పరిభంజ నోత్కట రావాల్లో
నెట్టుకొని తట్టుకొని
ఈ మేఘాలు
ఆకాశంలో కాదు
అవని మీదనే తిరుగుతున్నాయి

ఒక్క ఆశాంశ
ఎక్కడైనా కేలూత నిస్తుందేమోనని,
ఒక్క కేలూత
చక్కటి ఈ పర్వతం మీది కెక్కిస్తుందేమోనని,

ఎప్పటికైనా
ఈ ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్
తనకు నిచ్చెన వేసి నింగికి ఎత్తదా అని,

ఎప్పటికైనా
ఈ వ్యవస్థా జనితా క్షుదార్తిలను
తుడిచి పెట్టడానికి గర్జించలేమా అని

ఎప్పటికైనా
ఈ ఆకాశపు అంచుల్ని వంచి
చుక్కల కాంతుల్ని తుంచి
వసుంధరకు మెరుపుల కొన్క యివ్వలేమా అని

ఎప్పటికైనా
తమ గుండెల్ని, కండల్ని
కరగించి, వర్షించి
బీడు వడ్డ ఈ క్షేత్రాలని
సస్యశ్యామలం చేయాలేమా అని,

ఆశతో
ఆబతో
నిరీక్షిస్తూ
వేదనను జయిస్తూ
బాధలను భరిస్తూ
నిర్వీర్యాన్ని శపిస్తూ
ఈ మేఘాలు అవని మీదనే తిరుగుతున్నాయి
నీటిని ధరించి కాదు - శ
న్నీటిని భరించి బ్రతుకుతున్నాయి.

(ఆంధ్రప్రభ వారపత్రిక)

# 14. శుభాశీస్సు !

బాధల తాకిడికి బ్రతుకు
బరువు మోయలేని యపుడు
సానుభూతి చూపగలుగు
చల్లని ఒక పలుకు చాలు—

గుండెలలో ఆవేదన
గుంపులు, మేఘాలయితే
పవనుని వీవెనగా ఒక
పలకరింత చెంత చాలు—

చీకటి గర్భం లోపల
చిరు దీపం ఒక తపస్సు
శోకంలో ఓదార్పుల
శీకరమే ఒక ఉషస్సు

తనువంతా అవమానపు
తపనలతో మండు నపుడు
మనసున కొక సహనపు- మరు
మల్లె గుబాళింపు చాలు—

అనాసక్త ఎడారిలో
అనురాగం ఒయాసిస్సు
అరమరికలు లేని ప్రేమ
అను నిత్యం శుభాశీస్సు—

(జమీన్ రైతు)

# 15. నేను మాత్రం

వాసంతా లెన్నో వచ్చి
వాకిట్లో తలుపు తట్టి
పిలిచి పిలిచి నిద్ర లేపి
పిదిలి వెళ్ళి పోయాయో !

ఉషోదయా లెన్నో విరిసి
నిషాదించి హుషారిచ్చి
చెప్పకుండ ఏమూలన
కుప్ప కూలాయో !

వెలుగు రేఖ లెన్ని - ఎడద
వీధుల్లో వెలిగి వెలిగి
అల్లి బిల్లి ఆటలాడ
జల్లెడలో జారయో !

అందమైన భావాలవి
అంతరంగమధనంలో
జన్మమెత్తి, నన్ను హత్తి
ఉన్మదించి ఎగిరాయో !

కమ్మని నా కలలెన్నో
ఝుమ్మని తుమ్మెద పదముల
బంభరించి, ఎడద వీడి
బయలు పట్టి ఏడ్చాయో !

నే మాత్రం ఒంటరినే !
అణు మాత్రం తుంటరినే !
సోమరినే ! అందుకనే
ఈ మజిలీ చిర వాసం !

(ఆంధ్రప్రభ)

# 16. చర్విత చర్వణం

అవే అక్షరాలు
అవే పదాలు
అవే పాదాలు
ఈ పేజీ మారడం లేదు
కొత్త పేజీ రావడం లేదు

ఇక్కడ
ప్రతి అక్షరమూ ఒక క్షణం
ప్రతిక్షణం ఒక మరణం
ఒక హత్య
ఒక ఆత్మహత్య
ఒక మోసం - ఒక దగా
ఒక మానభంగం

ఇక్కడ
ప్రతి పదం అనుమానాస్పదం
ప్రతి పాదం పదవీ వ్యామోహాంధం
ప్రతి నాదం మధుపాన మదోన్మత్తం
ప్రతి వాదం స్వప్రయోజనాలతో ఖేదం

కొత్త పేజీ తెరవాలనే ఆరాటం
కోరిక గనే మిగిలి పోతుంది
పాత పేజీలోని సారాంశం
ప్రతి సారీ చర్విత చర్వణ మవుతుంది -

ఎంత చదివినా ఈ పేజీ మారడం లేదు
ఏమి చేసినా ఈ పేచీ తీరడం లేదు

"కొత్త పేజీలో
ప్రతి అక్షరం ఒక డైనమైట్
ప్రతి పదం ఒక మెషిన్‌గన్
ప్రతి పాదం విప్లవగీతం
ప్రతి నాదం ప్రగతి వేదం"—

అని నేను అనుకుంటున్నాను
ఆ ఆశతోనే ఉంటున్నాను

ఆ పేజీ అంటే నాకు
అంతు లేని ఆపేక్ష
ఆ పేజీ చదవడం పూర్తి చేశానో
అప్పుడంతా సమానత్వం సర్వం

అప్పుడంతా అవుపిస్తుంది
అభినవ శాంతి పర్వం—

దాని కోసమే నా ఆరాటం
దాని కోసమే నా పోరాటం —

నేను కొత్త పేజీ చదవక పోవచ్చు
నా కొడుకులైనా చదువుతారని
ఈ పేజీకి భరత వాక్యం పాడతారనీ
ఎంత తొందరగా చదివేస్తున్నానో ఈ పేజీ !

అయినా
అవే అక్షరాలు
అవే పదాలు
అవే పాదాలు

అక్షరాలను శిక్షించాలని
పదాలను వధించాలని
పాదాలను ఖండించాలని
నా అణు వణువునా కసి
వర్తమానం అంతా మసి —

అంతరంగం మారితే
ఆర్త గీతం ముగుస్తుంది
వర్త మానం దాటితే
భవిష్యత్తు చిగురిస్తుంది !

(ఆంధ్రప్రభ)

# 17. రుక్మిణి నీ ఆదర్శం

చెల్లీ ! చెల్లీ ! నీకొక
చిన్న మాట చెప్పేదా !
పోనీ ఆలోచనముల
పొట్లమొకటి విప్పేదా !

దేశమేలు నేతలు సం
దేశ మివ్వ లేని మాట
నాన్నలు అమ్మలు నీకే
నాడు విప్పినట్టి మాట !

కట్నమనే పిశాచమును
కన్నదెవరు ? పెంచిరెవరు ?
విశృంఖలమైన దాని
విహారం సహించి రెవరు ?

ఆచారం దాని తల్లి
ఆశ దాని కన్న తండ్రి
ఆ యిరువురి అక్రమ సం
తానమె కద యీ కట్నం !

సంఘం వెన్ను ముక మీద
జనియించిన రాచకురుపు
శస్త్రచికిత్సల కైనా
సర్దు కోదు దాని సలుపు

చెల్లి చెల్లి నీకొక
చిన్న మాట చెప్పేదా!
పోనీ ఆలోచనముల
పొట్ల మొకటి విప్పేదా!

దేనిని సహియింప లేమొ
దానిని భరియింప వలయు
నని చెప్పుట నాటి మాట
పడి పోయిన పాత కోట —

దేనిని భరియింప లేమొ
దానిని కడ తేర్చ వలయు
నని చెప్పుట నేటిపాట
విక సించిన పూల తోట

పడిపోయిన కోటలలో
ప్రాభవాలు మనకు వద్దు
వికసించిన తోటలలో
విరులేరుట మనకు ముద్దు

మనలో ధృడ దీక్ష ఉన్న
మంచిని వెలిగించగలము
శాసన మరికట్ట లేని
ఛిద్రం పోకార్చ గలము

ఎదలో సంకల్ప మున్న
పథమే పడి మార్చ గలము
సంఘోప కరమ్మునకై
సత్కార్యం చేయ గలము—

చెల్లీ చెల్లీ నీకొక
చిన్న మాట చెప్పేదా
పోనీ ఆలోచనముల
పొట్ల మొకటి విప్పేదా !

గత కాలపు స్వార్థా తప
ఋతు భయదపు గాలుల్లో
ఎన్ని కిన్నె ఆకు లెగిరి
ఏ దారుల రాలాయో !

ఏ కమ్మని కలలు కూర్చిర
లోకమ్మును వీడాయో !
ఏ కన్నుల కాటుకలవి
శోకమ్ముల కరిగాయో !

బుగ్గలపై పెండ్లి బొట్లు
బూడిదలో కలిశాయో!
పాదమ్ముల పారాణిని
ఖేదమ్ములు తుడిచాయో!

గాలులలో ఎన్ని విషా
దాలు సుడులు తిరిగాయో!
చీకటిలో చిరు గుండెల
కేక లెన్ని ముగిశాయో!

ఏమని చెప్పేదమ్మా
ఎదకాల్చిన విసపు కథలు
వర విక్రయపు పద ఘట్టన
చెర బట్టిన పేద వ్యథలు

చెల్లీ! చెల్లీ! నీ కొక
చిన్న మాట చెప్పేదా!
పోనీ ఆలోచనముల
పొట్ల మొకటి విప్పేదా!

అతనివోలె నీవు గూడ
అవతరించి నావు గదా!
బ్రతుకున జత గూడుటకై
అతని నేల కొనవలయును?

బ్రతుకున జత గూడుటకై
అతని నేల కొన వలయును
బ్రతు కిచ్చిన తలి దండ్రుల
వెతల నేల గూర్చ వలయు ?

వంట యింట బానిసగా
వరలుటకా ? తిరుగుటకా ?
పిల్ల లుగను యంత్రముగా
పిలువ బడుట కొరకేనా ?

కాదు కాదు సమానత్వ
సంగ్రామం నీధ్యేయం
నరుడైనా నారి యైన
పరి సమాన మది ధర్మం.

ఇవి యన్ని నీతులంచు
ఎంచావో యింతే సరి !
అజ్ఞానపు యజ్ఞంలో
అబలా ! నువ్ సమిధవు ! హరి !

కొత్త వాకిళులను తెరచి
కొని బయటకు సాగిరమ్మ !
తర తరాల ఆచారపు
త్రాడుల తెగ త్రెంచి కొమ్మ !

పురాణాలు పుక్కిటి వని
బూజు పట్టి పోయినవని
ఎంచకు చెల్లీ యెన్నడు
మంచికి అవియే కన్నులు—

భాగవతపు రుక్మిణి నీ
పాలిటి కాదర్శ మమ్మా!
ఎన్ని బంధనాలు త్రెంచు
కొన్నది తన వలపు కొరకు—

తానే తన ప్రియునకు ఒక
దారి చెప్పి పంపించెను
దానిలోన సాగుచు చెలి
కానికి చేయందించెను

తెగువ యున్న చోటనె యే
తెంచు గదా విజయాలని,
చెప్పు నీకు రుక్మిణి కథ
చేకూర్చును వలపుల సుధ—

చెల్లీ! చెల్లీ! చెల్లీ!
చిన్న మాట విన్నావా!
చట్టాలవి చేయలేని
సంగ్రామం చేస్తావా?

తగిన వరుని జూచుకొమ్మ
వలపులతో గెలుచుకొమ్మ
వలపు గెలుచు కొన్న చోట
వరకట్నం నీటి మూట—

ఎద ఎదతో మీటు చున్న
పెదవి పెదవి కలిసి కొన్న
కౌగిలింత గాఢమైన
కట్నానికి తావు సున్న !

పెద్దలపుడు నీ కాశీ
ర్వాదము ఇత్తురు మెత్తురు
తలి దండ్రుల గుండెలలో
తరుణీ భారము తగ్గును—

సాహసాల బాటలోనె
సమస్యలకు చరమగీతి
వలపు తోడ విజయాలను
వరియించుటె నేటి రీతి

(ఆకాశవాణి విజయవాడ)

# 18. కన్నీటి కవిత.

మేరు నగం కూలిందట !
మేదిని కంపించిందట !
కడలి లాగా పొంగిన ఒక
కవి హృదయం యింకిందట !

రేపటి దీపం కోసం
రే బవలూ తపియించిన
ఒక పతాక చెరిగిందట
ఒక ప్రతీక ఒరిగిందట.

అన్నా ! నిన్నా ! మొన్నా !
ఎన్నాళ్లుగ నీలేఖిని
నా జాతికి గర్వమాయె
నారీతికి సర్వమాయె

అంధకార చేదనకై
అర శతాబ్ది వెలుగిచ్చిన
దీపం కొండెక్కిన దట !
తేజం మస కేసినదట !

ఆకాశపు దారులంట
హడావిడిగ వెళిపోయే
కవితా జగన్నాథ రథం
భువికి దించి నడిపించిన

పతితులకై భ్రష్టులకై
బాధా సర్ప దష్టులకై
దగా పడిన తమ్ములకై
దారు లెన్నో వెదికించిన

శ్రీశ్రీ ! శ్రీశ్రీ ! శ్రీశ్రీ !
చెదిరి పోని కవితాశ్రీ !
రూపంగా యిక లేవట !
దీపంగా మిగిలావట !

ఊరవతల నీరింకిన
చెరువు మాది ! చెట్టు మాది !
ఎటు జూస్తే అటు చీకటి
పటు దుఃఖపు బతుకు మాది !

ఏబది ఏడుల కవితకు
ఏల్బడి దారుడవు నీవు
కవితా సతి కెన్నెన్నో
గతు లిచ్చిన ఋతువు నీవు

అభ్యుదయ కవితోద్యమ
ఆశయాల క్రితువు నీవు
విప్లవ భావన నెపుడూ
విడువ నట్టి జతవు నీవు

రవి మొక్కని వెలుతురులో
గ్రహము లెన్నొ వెలుగునట్లు
కవీ ! భవత్ ఛాయలందు
కవులు కవులు వేలవేలు

ఏనాటికి తప్పిపోని
ఎన్నికైన ముద్రనీది -
తెలుగు వాని కైత కీర్తి
దిగంతాల వ్యాప్తి నీది—

ఏజాతి చరిత్రనైన
ఎపుడో ఓ వెయ్యేళ్ళకు
నీలా ఓ కవి పుట్టును
నిజపు దారి చూపించును

కొమ్మలు చీల్చుక యెగిసే
కమ్మని పూనెత్తావులు
గాలిలోన నీ కథ, లో
కాల నిల్ప గలవు నిజము—

నీ విచ్చిన ఒక్క "మహా
ప్రస్థానము" చాలు మాకు
వేల వసంతాలు తెలుగు
వాడికి వేడిచ్చు కొరకు—

(విశాలాంధ్ర)